శ్రీమతే రామానుజాయ నమః



శ్రీపరమహంస పరివ్రాజకాచార్యేత్యాది

శ్రీ ఎమ్బార్ జీయర్‌స్వామి అనుగ్రహించిన

# శ్రీఉడైయవర్ తిరుమఞ్జనక్కట్టియమ్

( శ్రీరామానుజుల దివ్యమంగళ విగ్రహాన్ని వర్ణించే గద్యం )

ఆంధ్రానువాదము

అనువక్త

**శ్రీమాన్ డా॥ ఈ.ఏ. శింగరాచార్యులు**

న్యాయవేదాన్త విద్వాన్,

ఉ.వే. శ్రీమాన్ ఈయుణ్ణి రంగాచార్యస్వామివారి

87వ తిరునక్షత్రోత్సవ జ్ఞాపిక

ప్రకాశకులు : శ్రీకృష్ణ ఛారిటబుల్ ట్రస్ట్, నరసాపురం

2011

శ్రీఉడైయవర్ తిరుమజ్జనక్కట్టియమ్ - ఆంధ్రానువాదంతో

అనువక్త - ఉ.వే. శ్రీమాన్ డా॥ ఈ.ఏ. శింగరాచార్యస్వామి

అన్ని హక్కులు అనువాదకునివే.

ప్రకాశనము : మార్చి, 2011

ప్రతులు : 500

వెల : రు. 10/-

సందర్భము : ఉ.వే.శ్రీమాన్ ఈయుణ్ణి రంగాచార్యస్వామివారి తిరునక్షత్రోత్సవం

ఆవిష్కరణము : 22-3-2011

వేదిక : తెలగా కళ్యాణమండపము, నర్సాపురం

ముఖచిత్రం : భగవద్రామానుజులు, శ్రీపెరుంబూదూరు

ఈ గ్రంథం "శ్రీకృష్ణ ఛారిటబుల్ ట్రస్ట్", నర్సాపురం వారు సమర్పించిన పవిత్రద్రవ్యంతో ముద్రింపబడినది

ప్రతులకు :

శ్రీకృష్ణఛారిటబుల్ ట్రస్ట్, 4-1-17/3(2)

కూనపరెడ్డివారి వీథి, నర్సాపురం. ఫోన్ : 9494480283

అక్షరయోజనము : అన్నపూర్ణ గ్రాఫిక్స్, 53/4, ఆర్.ఎస్.గార్డెన్స్, తిరుపతి

ముద్రణ : సి.యన్. ప్రింటర్స్, తిరుపతి



# అవతరణిక

ఈ కట్టియమును అనుగ్రహించిన మహాత్ములు శ్రీశ్రీశ్రీపరమహంస పరివ్రాజకాచార్యేత్యాది శ్రీపెరుమ్బూదూర్ ఎమ్బార్ జీయర్ స్వామివారు. వీరి వైభవవివరములన్నియు ఉ.వే. శ్రీమాన్ ఎస్. కృష్ణస్వామిఅయ్యంగార్ స్వామివారు (శ్రీసుదర్శన పత్రికాసంపాదకులు, పుత్తూర్ అగ్రహారము, తిరుచ్చి) తమ శ్రీసూక్తిమాలా ప్రచురణలలో 24వ గ్రంథముగా ముద్రించిన **"శ్రీవచన భూషణ వ్యాఖ్యానజ్గళ్"** అను గ్రంథము ప్రారంభములో వాగమృతవర్షి, ఉ.వే. శ్రీమాన్ వేళ్విక్కుడి వరదాచార్య స్వామివారు అనుగ్రహించిన **"ఎమ్బార్ జీయర్ వైభవము"** అనుశీర్షికనుండి కృతజ్ఞతాపూర్వకముగ గ్రహింపబడినవి.

**"కట్టియమ్"** అనుద్రావిడ పదమునకు ప్రభువులు మొదలగువారి కీర్తిని పొగడు వాక్యజాలమను అర్థము నిఘంటువులలో కన్పడుచున్నది. ఇట్టి కట్టియములను శ్రీపరాశరభట్టరువారు నమ్బెరుమాళ్ విషయమున అనుగ్రహించిరనుట సుప్రసిద్ధము. యతిరాజులగు భగవద్రామానుజుల దివ్యమంగళరూపమును వర్ణించు గద్యరూప ప్రకృతప్రబంధమునకు ఈపేరు మిక్కిలి అన్వర్థము కదా ! ఇందు శ్రీపెరుమ్బూదూర్లోని భగవద్రామానుజుల అర్చామూర్తియొక్క అభిషేకసమయము లోని సౌందర్యము పాదముల మొదలు శిఖాపర్యంతము వర్ణింపబడినది. **"దేవా శ్చరణతో వర్ణ్యాః"** అను ఆలంకారిక సమయమునుబట్టి ఈ పాదాది కేశాంతవర్ణన చేయబడినది. ఈ కట్టియములన్నియు ఆయా దేవతలను వర్ణించు శ్లోకముతో ప్రారంభింపబడి పిమ్మట రచింపబడు గద్యమంతయు ఆ శ్లోకమునకు వివరణరూపముగా కన్పించుచున్నది. ఈకట్టియములోని మొదటిశ్లోకము కూరేశులు శ్రీరామానుజుల విషయమున అనుగ్రహించిన ముక్తకము కాగా, పిమ్మట గల చూర్ణికలన్నియు దానికి వివరణ రూపములుగా నున్నవి. ఇది భగవద్రామానుజ అవతారోత్సవ దినములలో శ్రీపెరుమ్బూదూర్లోనేకాక, అస్మద్వంశములో అవతరించిన శ్రీరామానుజాచార్యుల వారను మహనీయులచే వారి శిష్యరత్న మగు శ్రీపుప్పాల రమణప్పనాయుడుగారి ద్వారా సుమారు 130సం॥లకు ముందు నరసాపురము (ప.గో.జిల్లా) లో నిర్మింపచేయబడినది, ప్రాతఃస్మరణీయకీర్తివైభవులు, విద్వన్మూర్ధన్యులు, అస్మత్ మాతృపితామహపాదులు అగు శ్రీమాన్ కిడాంబి గోపాలకృష్ణమాచార్యస్వామి వారు, ఉభయవేదాంత మహావిద్వాన్, అస్మత్పితామహపాదులు శ్రీమాన్ ఈయుణ్ణి శేషశింగరాచార్యస్వామివారు, తమ జీవితమును సమస్తమును అచటి ఆలయసేవకే వినియోగించిన మహనీయులు ఉ.వే. శ్రీమాన్ నడాదూరు వేంకటవరదకృష్ణమాచార్య స్వామివారు, అస్మత్ పితృపాదులు, ఉ.వే. శ్రీమాన్ ఈయుణ్ణి రంగాచార్య స్వామివారు మొదలగు మహనీయులచే అభిమానింపబడుచు, అభినవ భూతపురిగా ప్రసిద్ధినొంది నదియు అగు ఎమ్బెరుమానార్ స్వామివారి కోవెలలో కూడ ప్రతి సంవత్సరము అవతారోత్సవములలో జరుగు తిరుమజ్జన సమయమున అనుసంధింప బడుచున్నది.

ఈ కట్టియము **"శ్రీఉడైయవర్ వడివఴుకిల్ అడియార్కళ్ ఈడుపాడు"** అను పేరుతో కూడ ప్రసిద్ధము. ఇందు పలు దివ్యసూరులు, ఆచార్యులు భగవానుని దివ్యరూపము విషయమున అనుగ్రహించిన సూక్తులు శబ్దతః, అర్థతః భగవద్రామా నుజుల విషయమున అనుసంధింపబడినవి. ఆ సంవాదములను, వాని ఆకరములను, పాఠాంతరములను తెలిసినంతవరకు చూపితిని. ఈ కట్టియమును రచించిన ఎమ్బార్‌జీయర్‌స్వామివారిచే ప్రణీతమైన శ్రీరామానుజాష్టపదీ స్తోత్రములోని పలు సూక్తులతో ఇందలి ప్రయోగములకు సామ్యములును కలవు. దాసుడు ఎఱిగిన విధమున అనువాదముకొఱకు యత్నించితిని. ఈ ప్రయత్నమున ఎంతమాత్రము సఫలీకృతుడనైతినో విజ్ఞులే నిర్ణయింతురు.

ఈ కట్టియము ఆంధ్రానువాదముతో పాటుగా 2002 వ సంవత్సరంలో భగవద్రామానుజులవారి తిరునక్షత్రోత్సవ సందర్భంలో ఉ.వే. శ్రీమాన్ యస్.వి. రంగరామానుజాచార్య స్వామివారి ప్రోత్సాహంతో వారి పితృపాదులైన ఉ.వే. శ్రీమాన్ సముద్రాల లక్ష్మణాచార్య స్వామివారి స్మారకంగా ఉ.వే. శ్రీమాన్ కె.యస్. రామానుజా చార్య స్వామివారి సమ్మానోత్సవంలో ముద్రింపబడింది. మళ్ళీ ఇపుడు ఈ ఏడు పితృచరణులైన ఉ.వే. శ్రీమాన్ రంగాచార్య స్వామివారి 87వ తిరునక్షత్రోత్సవ సందర్భంగా నరసాపురంలోని తెలగా కల్యాణమండపంలో అత్యంత వైభవంగా మూడు రోజుల పాటు జరిగే కార్యక్రమాలలో ఈ గ్రంథం ఆవిష్కరింపబడడం జగదాచార్యులైన భగవద్రామానుజుల ముఖోల్లాసానికి తప్పక కారణం కాగలదనడంలో సందేహం లేదు. సాహిత్య రసికులు, సహృదయులైన ప్రపన్నులంతా ఈ గ్రంథాన్ని, దీని అనువాదాన్ని స్వీకరిస్తారని నమ్ముతున్నాను. ఈ గ్రంథాన్ని ముద్రించడానికి తగిన ఆర్థిక సహాయాన్ని అందచేసిన శ్రీకృష్ణచారిటబుల్ ట్రస్ట్, నరసాపురం అభినందించతగినది. ఇప్పటికే ఈ సంస్థ ద్వారా పూర్వదినచర్యా, ఉత్తరదినచర్యా వ్యాఖ్యానం, శ్రీరామానుజ స్తుతి మణిమాల, కూరేశపంచాశత్ వ్యాఖ్యానమ్, నిగమనపడి ఆంధ్రానువాదము, అలర్‌మేల్ మంగై ప్రపత్తి, మంగళాశాసన వ్యాఖ్యానం ముద్రింపబడ్డాయి. భవిష్యత్తులో ఈవిధంగానే మరిన్ని సద్గ్రంథాలు ఈసంస్థద్వారా శ్రీరామానుజుల కృపా కటాక్షం వల్ల ముద్రింప బడాలని మంగళాశాసనములను చేస్తున్నాను. స్వస్తి.

*యతివరమజ్జనగద్యం హృద్యం శ్రీ శింగరార్య దాసోఽ యమ్ ।*
*ఆంధ్రీకురుతే ప్రీత్యై విదుషాం స్వాచార్యభవ్యకారుణ్యాత్ ॥*

*అభినవభూతపురప్రియ! కరుణాశాలిన్! కటాక్షయ యతీశ ।*
*అభిషేకగద్యమాంధ్ర్యామనూదితం భక్తపీయూషమ్ ॥*

ఇట్లు
భాగవతవిధేయుడు
ఈ.ఏ. శింగరాచార్యులు

తిరుపతి
8-12-2002



# శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య
# శ్రీశ్రీశ్రీ పెరుమ్బూదూర్
# ఎమ్బార్ జీయర్ స్వామి వైభవము

**శ్రీవాధూల రమాప్రవాళరుచిరస్రక్సైన్యనాథాంశజ-**
**శ్రీగుర్వింద్రమహార్యలబ్ధనిజసత్సత్తం శ్రితాభీష్టదమ్ ।**
**శ్రీరామానుజముఖ్యదేశికలసత్ కైంకర్యసంస్థాపకం**
**శ్రీమద్వేంకటలక్ష్మణార్యయమినం తం సద్గురుం భావయే ॥**

శ్రీవైష్ణవదివ్యక్షేత్రములు 108లో నడునాట్టుత్తిరుపతులు (మధ్యదేశక్షేత్రములు) రెండిటిలో ఒకటియు, నాలాయిరదివ్యప్రబంధమునకు జన్మస్థానమును అగు **"తిరుక్కోవలూరు"** (శ్రీగోపాలపురము) అను దివ్యదేశమునకు తూర్పు దిశలో **"కప్పియామూర్"** అను గ్రామముండెడిది. అందు నివసించు శ్రీవత్సకులతిలకులైన శ్రీమాన్ రాఘవాచార్యస్వామి, పతివ్రతాశిరోమణి యగు జానకీదేవి అను పుణ్య దంపతులకు కలియుగాది 4935వ సంవత్సరము (ప్రభవాది జయనామ సంవత్సరము) నకు సరియగు క్రీ.శ.1834 సం॥న శ్రావణమాసము (ఆవణిమాసము) రోహిణీ నక్షత్రములో ఒక కుమారరత్నము కల్గెను. వీరే తరువాతి కాలమున **"ఎమ్బార్ జీయర్"** స్వామిగా ప్రసిద్ధి చెందిరి. తల్లిదండ్రులు వీరికి పెట్టిన పేరు. - **"కృష్ణన్"** (కృష్ణమాచార్యులు) శ్రీకృష్ణుడు అవతరించిన శ్రీజయంతినాడు ఈమహా నీయులు అవతరించుటచే వీరికి ఇట్టి పేరు పెట్టబడినది కాబోలు! యథా శాస్త్రము జాతకర్మ-నామకరణ - ఉపనయనాది సంస్కారములను సకాలమున పొందిన వీరు బాల్యము నుండియే అనన్యసామాన్యమైన మేధావిలాసమును, **"బాల్యాత్ ప్రభృతి సుస్నిగ్ధః"** అను రీతిలో భక్తిని, వైరాగ్యసంపదను కల్గియుండి, చూచువారికి ఆశ్చర్యమును కల్గించుచుండిరి. అన్యబాలకులవలె బయటివారితో ఆడుకొనక, ఇంటిలో ఎల్లప్పుడు భగవద్విగ్రహములతోనే ఆటలాడుకొను చుండిరి. ఇట్లు ఒకనాడు వారు ఆడుకొను నపుడు శ్రీవేంకటేశ్వరుని విగ్రహము తప్ప మిగిలిన విగ్రహములన్నియు చిత్రముగా మాయమయ్యెను. క్రమముగా కృష్ణమాచార్యుల వారు తర్కవ్యాకరణ పూర్వమీమాంసా వేదాంతాది సకల శాస్త్రములందు పరిపూర్ణపాండిత్యమును గడించిరి. ప్రాప్తయౌవనులైన

వీరికి తండ్రిగారు వివాహము చేయసమకట్టి, తమ బంధువులలో ఒక కన్యనుగూర్చి విచారింప సాగిరి. అల్పాస్థిరములైన లౌకిక భోగములు శిష్టగర్హిత ములు, స్వరూప విరుద్ధములు, పరమప్రాప్య ప్రతిబంధకములని గుర్తించిన వీరు ఆప్రయత్న మును విరమింపుడని తండ్రిగారిని ప్రార్థించి, తమ హృదయమును వ్యక్తీక రించిరి. శ్రీరాఘవాచార్యులవారు పుత్రుని ఆ వైరాగ్యమును చూచి ఆశ్చర్యపడి, అతడు కారణజన్ముడేనని నిశ్చయించుకొని తమ ప్రయత్నమును మానిరి.

అనంతరము చోళసింహపురములో చండమారుతం దొడ్డయాచార్య స్వామి వారి వంశమున జన్మించిన వారు, వాధూలకుల తిలకులును అగు ఉ.వే. శ్రీమాన్ కోయిల్ కందాడైరంగాచార్యస్వామి వారను మహాత్ములు దివ్యదేశయాత్రాసందర్భముగా కప్పియామూర్‌కు రాగా, కృష్ణమాచార్యులవారు వారిని ఆశ్రయించి, పంచసంస్కారము లను పొందిరి. అపుడు రంగాచార్య స్వామివారు తమ ఆరాధనలోని శ్రీవేంకటేశ్వరుని అర్చామూర్తిని తమశిష్యులగు కృష్ణమాచార్యులవారికి ప్రసాదించిరి. బాల్యమున తాము ఆడుకొను విగ్రహము లలో శ్రీవేంకటేశ్వరుని అర్చామూర్తి ఒక్కటి మాత్రము తమవద్ద మిగిలి యుండుటలోని పరమార్థమిది కదా! అని కృష్ణమాచార్యుల వారు అపుడు తలచిరి. పిమ్మట కొంతకాలము తిరునాఙ్గూర్ అను దివ్యదేశములో తమకు సబ్రహ్మ చారులగు శ్రీమాన్ రంగస్వామి అయ్యంగార్‌తో కలసి ప్రతివాది భయంకరం రంగాచార్యులవారి ఇంటిలో ఉండి, శాస్త్రచర్చలను చేసిరి. ఆచార్య నియమనముపై అనంతరము యాత్రకై బయలుదేరి, శ్రీపెరుంబూదూరు చేరి, భగవద్రామానుజుల సన్నిధికి ఎదురుగా ఒకమూలనిలచి, ఆ అర్చామూర్తిని అత్యంతము అభినివేశముతో అయిదు దినములపాటు సేవించిరట. ఆఱవ దినమున అచటి అర్చకులలో ఒకరు అగు శ్రీరాఘవభట్టర్ కృష్ణమా చార్యులవారిని గమనించి, ఆశ్చర్యపడి, ‘‘వీరు నిత్యసూరులలో ఒకరై యుందురా ఏమి?’’ అని తలచి, వారిని ఆలయములోనికి తీసికొనిపోయి, భగవద్రామా నుజుల దివ్యరూపమును సాక్షాత్కరింప చేసిరి. ఆనాడు భగవద్యా మునుల అవతారోత్సవదివసమగుటచే శ్రీయామునుల - శ్రీరామానుజుల అర్చామూర్తులు కలసి వేంచేసి యుండిరి. ‘‘ఇట్లు అనుగ్రహించుట ఇట్టి అపూర్వసన్నివేశమును వీరి అవతారకాలమున సేవింపని కొఱత తీర్చుటకొఱకా? లేక, నన్ను భాగవత పరతంత్రునిగా చేయుటకా?’’ అని వితర్కించుకొనుచు ఆర్ద్రచిత్తులై, ఆ అర్చామూర్తులను దర్శించి, కృతార్థులయ్యిరి. పిమ్మట చోళసింహపురమును చేరి, ఆచార్యుల ఆజ్ఞపై తమవద్దకు వచ్చినవారికి తత్త్వోపదేశములను చేయు చుండిరి.



ఇట్లుండ, వీరి అతిలోకసౌందర్యమును, గుణములను, పాండిత్యమును చూచి, అచటి పండితులలో ఒకరు తమ కుమార్తెనిచ్చి వివాహము చేయ ప్రయత్నించిరి. కాని, కృష్ణమాచార్యులవారు అందులకు తిరస్కరించిరి. ఆనాటి రాత్రిలో వీరికి భగవద్రామానుజులు స్వప్నమున సాక్షాత్కరించుటయే గాక, వేఱొక నాడు రాత్రిలో ఆదిశేషుల ఫణావళిక్రింద వేంచేసియున్న శ్రీమణవాళ మహామునులును దర్శనమిచ్చిరట. అప్పటినుండి వీరికి వైరాగ్య సంపద వేయి రెట్లుగా వృద్ధినొందెను. పిమ్మట శ్రీపెరుంబూదూరు చేరి, భగవద్రామానుజులను సేవించి, **“హే గోదాగ్రజ! హే కృపాజలనిధే! హే శ్రీనిధి! శ్రీగురో! హే యోగీశ్వర!, హే కురంగనగరీ పూర్ణాశ్రితాంఘ్రిద్వయ!, హేరామానుజ! హే జగత్త్రయగురో! హే పుండరీకాక్ష! మాం, హేరామ ప్రియనాథ! పాలయ పరం జానామి న త్వాం వినా”** ఇత్యాదిగా స్తుతించిరి.

ఆ పిమ్మట తిరుమలను చేరి, అచట కొంతకాలము భగవత్సేవలో కాలము గడపిరి. అపుడు ఎమ్బార్ (గోవిందభట్టర్) వీరికి కలలో కన్పించి, ‘‘కృష్ణమాచార్యా! భగవానుని శేషవస్త్రమగు ఒక చక్కని శాలువను గైకొని నా జన్మస్థలమగు మధురమంగ లక్షేత్రమునకు రండు’’ అని ఆజ్ఞాపించిరి. తమకు కల్గిన కలనుగూర్చి శ్రీ తిరుమల పెద్దజీయర్ స్వామివారికి కృష్ణమాచార్యులవారు తెలిపిరి. వారును తమకును అట్టి కలయే వచ్చినట్లు సాశ్చర్యముగా పల్కి, శ్రీనివాసుని శేషవస్త్రమును వారికి ఇచ్చిరి. కృష్ణమాచార్యులవారు మధురమంగలమును చేరి, ఆ వస్త్రమును ఎమ్బార్ అర్చామూర్తికి సమర్పించిరి. వీరి ప్రభావము వలన అచట ఒక బాలకుని పట్టి వేధించు బ్రహ్మరక్షస్సు పాఱిపోవుటచే, ఆ బాలకుని తల్లిదండ్రులు మిక్కిలి సంతోషించి, కృష్ణమాచార్యులవారి ఆదేశాను సారము ఆచార్యకైంకర్యముగా మధురమంగలములోని ఎమ్బార్ అర్చామూర్తి కోవెలను పునరుద్ధరించి, మండపప్రాకారములను నిర్మించిరి. కృష్ణమాచార్యుల వారు ఎమ్బార్ ఆరాధనకు ఉపయోగించు తీర్థములో విశేషముగా పరిమళ ద్రవ్యములను చేర్చి, సిద్ధముచేయు కైంకర్యమును చేయుటచే వారికి **“పరిమళ కృష్ణమాచార్య”**లను పేరు కల్గెనట. ఎమ్బార్ సన్నిధి కైంకర్యము అట్లే చిరకాలము నిర్వహింపబడుటకు జీయర్ వ్యవస్థను ఏర్పాటు చేయగోరి, అందులకు తగిన వ్యక్తికొఱకు అన్వేషించిరి. కాని తగిన వ్యక్తి దొరుకక పోవుటచే తామే సన్న్యసింప నిశ్చయించుకొని, ఆ అభిప్రాయమును తిరుమల పెద్దజీయర్ స్వామివారికి నివేదించి, వారిద్వారా శ్రీవేంకటేశ్వరుని అనుమతిని పొంది, జీయర్ అయ్యిరి. అప్పటినుండి వీరికి **“తిరువేంకట రామానుజజీయర్”** అను పేరు కల్గినది. మధురమంగల క్షేత్రములోని

ఎమ్బార్ సన్నిధికైంకర్యముకొఱకు పాటుపడిన వీరు పిమ్మట **"ఎమ్బార్ జీయర్"** గా ప్రసిద్ధిగాంచిరి. తరువాత తిరునారాయణ పురము (మేల్కోటై) కు వెడలి, అచట కోయిల్ కన్దాడై దొడ్డయాచార్యస్వామి వారి సన్నిధిలో శ్రీభాష్య కాలక్షేపమును చేసిరి. ఎమ్బార్జీయర్స్వామి వైభవమును చూచి వారి ఆచార్యులగు దొడ్డయాచార్యుల వారే వారికి తనియన్ అనుగ్ర హించిరట. తదనంతరము శ్రీపెరుమ్బూదూర్ చేరి, భగవద్రామానుజుల సేవలో చిరకాలము గడపిరి. శ్రీమన్నాథమునులు అవతరించిన వీరనారాయణ పురమునుండి శ్రీపెరుంబూదూర్కు వేంచేసిన శేషాద్రి అయ్యంగార్ అను ధార్మికులు ఎమ్బార్జీయర్ జ్ఞాన వైరాగ్యవైభవమును దర్శించి, ఆశ్చర్యపడి, వారికి భగవద్రామానుజుల దివ్యాలయమునకు దక్షిణవీథిలో ఒక మఠమును నిర్మించిరి. గోవింద భట్టర్ వైభవమువలె, వీరి వైభవము సర్వమును ఆచార్యాధీనము. కావున ఎమ్బార్ జీయర్ అను పేరు వీరికి సార్థకము.

శ్రీపెరుంబూదూర్లో ఉత్సవ సమయములందు శ్రీరామానుజులను గజగతి, సింహగతి మొదలగు రీతులలో వేంచేపు చేయుట, తిరుమజ్జన సమయములలో కట్టియమును అనుసంధించుట, ఉత్సవకాలములో అవతార మండపములో నెలకొనియున్న 74మంది సింహాసనాధిపతులకు శఠారి సమర్పించుట, ఏకాంతసేవలో కట్టియము విన్నపించుట, ఎచ్చరికలు పఠించుట- ఇత్యాది పలు కైంకర్యములను ఎమ్బార్ జీయర్స్వామి నిర్వహించుచుండిరి. శ్రీరంగములోని శ్రీరంగనాథుని సిరిని శ్రీభగవద్రామానుజులు తీర్చిదిద్దినట్లే, శ్రీపెరుంబూదూర్లోని శ్రీరామానుజుల సిరిని వీరు తీర్చిదిద్దిరి. వీరు చేసిన మహత్కార్యములలో కొన్ని - 1. ఊర్ధ్వపుండ్రవిషయమున సిద్ధాంతముచేయుట, 2. భగవానుని లలాటమున అలంకరించు ఊర్ధ్వపుండ్రమును గూర్చిన విచారము, 3. **"శెత్తత్తిన్ వయిఱ్ఱిల్ శిఱుకుట్టి"** అను వాక్యమును గూర్చిన విచారము, 4. **"అన్దు శరాశరజ్గళై వైకున్దత్తేఱ్ఱి"** అను వాక్యార్థవిచారము, 5. ఉడైయవర్ తిరుమజ్జనక్కట్టియము, 6. శ్రీవచనభూషణ- శ్రీభాష్యముల ఐకకంఠ్యము, 7. పురాణ మార్గదీపికారచనము, 8. గర్భసమాశ్రయణవిచారము, 9. ఆచార్యాభిమానమే ఉత్తారక మనుటను విచారించుట, 10. మద్రాస్ నగరమున **"సత్య సమాజము"** అను సభను స్థాపించుట, 11. శ్రీపెరుంబూదూర్లో **"గోదా విలాసమ్"** అను నందనవనమును నిర్మించుట, 12. శ్రీపెరుంబూదూర్లో వనభోజనోత్సవమును ఏర్పాటుచేయుట మొదలగునవి. ఇంకను వీరి కృతులు అనేకములున్నట్లు తోచుచున్నది. సుమారు 60 సం॥లకు పూర్వము ఆనందప్రెస్ (మద్రాస్) వారు ముద్రించిన స్తోత్రార్ణవము



మూడవ భాగములో కన్పించు రామానుజాష్టపదీ స్తోత్రము, భగవద్రామానుజ దివ్యావతారవర్ణనము అను కృతులు వీరివే. రామానుజాష్టపది జయదేవుని అష్టపదుల శైలిలో రచింపబడి వానిని కూడ మరపింపచేయునట్టిది. ఇవియే కాక చెన్నై నగరములో గల గవర్నమెంటు తాళపత్రగ్రంథాలయములో లభించు **"సద్దర్శన సుదర్శనమ్"** అను చంపూగ్రంథము వీరి రచనగా కన్పించుచున్నది. ఇది ఇంకను ముద్రింప బడలేదు. విశ్వగుణాదర్శ చంపూరీతిలో సాగిన ఈ రచన సంప్రదాయవిషయ విమర్శనాత్మక గ్రంథముగా తోచుచున్నది. ఆనందాప్రెస్సువారు ముద్రించిన స్తోత్రార్ణవములో శ్రీరామానుజాష్టపది స్తోత్రకర్త పేరు శ్రీవాసదాస అని కలదు. ఈ నామము బహుశః తిరువేంకట రామానుజజీయర్ అను పేరుయొక్క సంస్కృతీకరణము కావచ్చును. పరపక్ష ప్రతిక్షేపణమును, విశిష్టాద్వైతసిద్ధాంత ప్రవర్తనమును అవిచ్ఛిన్నముగా సాగించిన ఈ మహానుభావులు కలియుగాది 4984 సం.స. అనగా, క్రీ.శ. 1883వ సం.న. చిత్రభాను సంవత్సరము పుష్య మాసమున (తైనెల) కృష్ణచతుర్దశి (త్రయోదశి అని కొందఱు అందురు) తిథిలో ఆచార్యుల సన్నిధిని చేరిరి.

*శ్రీమన్మహార్యకరుణాలబ్ధవిజ్ఞానసంపదే ।*
*శ్రీశైలలక్ష్మణార్యాయ మునయే నిత్యమంగళమ్ ॥*

శ్రీమతే రామానుజాయ నమః



శ్రీపరమహంస పరివ్రాజకాచార్యేత్యాది

శ్రీ ఎమ్బార్ జీయర్‌స్వామి అరుళిచ్చెయ్‌ద

# శ్రీఉడైయవర్ తిరుమఞ్జనక్కట్టియమ్

*కాషాయశోభి కమనీయశిఖానివేశం*
*దండత్రయోజ్జ్వలకరం విమలోపవీతమ్ ।*
*ఉద్యద్దినేశనిభ ముల్లసదూర్ధ్వపుండ్రం*
*రూపం తవాఽస్తు యతిరాజ ! దృశో ర్మమాగ్రే ॥*

1. [1]అప్పనుక్కు చ్చఙ్గాழி అళిత్తరుళుమ్ పెరుమాళ్ !
2. [2]అఱమికు నఱ్పెరుమ్బూదూర్ అవతరిత్త పెరుమాళ్ !
3. [3]అఱుశమయచ్చెడియదనై అడియఱుత్త పెరుమాళ్ !
4. [4]"అరుళాழிవరివణ్డే" యెన్ఱు ఆழ்వార్ అழైక్కుమ్ పెరుమాళ్ !
5. అరుళ్‌మారి యడియిణైక్కీழ் అన్బుపూణ్డ పెరుమాళ్
6. [5]అఞ్జుకుడి క్కొరుసన్తతియామ్ ఆణ్డాళ్‌తమక్కుమ్ అణ్ణరాన పెరుమాళ్ !
7. [6]అరఙ్గర్‌మౌళిశూழ்కిన్ఱమాలైయై చ్చూడికొడుత్తవళ్ తొల్లరుళాల్ తాழ்విన్ఱి వాழுమ్ పెరుమాళ్ !
8. [7]అడియార్ వినైత్తొడరై అరుళెన్నుమ్ [8]ఒళ్వాళురువిట్టిక్కுఱైగ్గొడు వెట్టిక్కళైన్ద పెరుమాళ్

---

| | | |
|---|---|---|
| 1. రామానుజాష్టపది | 2. ఉడైయవర్ వాழிత్తిరునామమ్ | |
| 3. ఉడైయవర్ వాழிత్తిరునామమ్ | 4. తి.వా. 1-4-6 | |
| 5. ఉప. ర. -24 | 6. ఇరా- 16 | 7. ? |



శ్రీమతే రామానుజాయ నమః



పరమహంస పరివ్రాజకాచార్యేత్యాది

శ్రీ ఎమ్బార్‌జీయర్‌స్వామి అనుగ్రహించిన

# శ్రీ ఉడైయవర్ తిరుమఞ్జనక్కట్టియము - ఆంధ్రానువాదము

యతిరాజా! కాషాయముతో శోభించునది, అందమైన శిఖయొక్క సన్నివేశమును కల్గినది, త్రిదండముతో విలసిల్లు కరమును కల్గినది, విశుద్ధ యజ్ఞోపవీతమును కల్గినది, ఉదయించు సూర్యుని వంటిది, మిక్కిలి ప్రకాశించు ఊర్ధ్వపుండ్రములను కల్గినది అగు నీ రూపము నా కన్నులముందు ప్రత్యక్షమగునుగాక!

1. (జగత్తుకు) తండ్రియగు వేంకటేశ్వరునకు శంఖచక్రములను అనుగ్రహించిన స్వామీ !
2. (పుణ్యము) ధర్మమునిండిన శ్రీ పెరుమ్బూదూర్‌లో అవతరించిన స్వామీ!
3. (చార్వాక, జైన, లోకాయతిక, ఆర్హత, మాయావాద, పాశుపతములను) ఆఱు అవైదికమతము లనెడి వృక్షమును నిర్మూలించిన స్వామీ !
4. "వర్తులములైన రేఖలనుకల అందమైన తుమ్మెదా ! అనుగ్రహింపుము" అని నమ్మాழ்వార్లు సంబోధించునట్టిస్వామీ !
5. కృపామేఘము అయిన శఠకోపుల పాదద్వంద్వమూలమునందు ప్రేమనిండుగా కలిగిన స్వామీ !
6. అస్థానే భయశంకను కల (మంగళాశాసనపరులైన) దివ్యసూరుల కులమునకు అద్వితీయసంతతియైన గోదాదేవికిని అగ్రజులైన స్వామీ !
7. శ్రీరంగనాథుని శిరస్సునందు అలంకరించు మాలికను (ముందుగా తాను) అలంకరించుకొని ఇచ్చిన గోదాదేవియొక్క నిర్హేతుకకృపచే కొఱత లేకుండ వర్ధిల్లు స్వామీ!
8. దాసుల పాపపరంపరలను కృప అను గొప్ప ఖడ్గమును గొని సమూలముగా ఖండించిన స్వామీ!

9. **నమ్‌దేశికర్‌శిఖామణి పెరుమాళ్ !**

**జయ ! విజయీ భవ !! నాయిన్దేన్ ! నాయిన్దేన్ !**

10. **దేవరీరుడైయ తిరువడిత్తామరైకళిన్ భోగ్యతాతిశయత్తుక్కు ఒరు పోలియాక [9]గంభీరాంభస్సముద్భూత సుమృష్టనాళరవికరవికసిత మానదోర్ శెన్దామరై ప్పూవై అదినుడైయ [10]గర్వసర్వస్వనిర్వాపణ పూర్వకమాక త్తిరువడికళిన్‌కీఴ్ అముక్కి, అదిన్ తలైమేల్ వెఱ్ఱియుడన్ వీఱ్ఱిరుక్కుమ్[11] ఇరుప్పినఴకుమ్.**

11. **పంకజరజస్సుమ్ [12]పాదారుంతుదమామ్బుడి చేటీజనలోచనచర్చా- సహ సౌకుమార్యశాలినికళాన పిరాట్టిమారుమ్ పిడిక్క క్కూశుమ్బడి [13]పుష్పహాససు కుమారతరరాన పెరియపెరుమాళుక్కుమ్ [14]మెత్తెన్న పఞ్చశయనమాయ్, అత్యంతసుకుమారరాన దేవరీర్ తమక్కాసన మాయ్ క్కొణ్డు తొణ్డుపూణ్డ పుణ్డరీకత్తుక్కు స్వదాస్యార్హ సారస్యాదికళై [15]యూట్టుకైక్కు తదాస్యాంతరత్తిల్ శొరుకియిట్టు వైత్తాప్పోలే మడైత్తిట్ట ఇడత్తిరువడికళుమ్**

12. **సంసరణదవదహనదందహ్యమానసకలజగదవనభరసంతత చింతాసమా క్రాంతియాలే విధృతతయా ఫణిపతిశయన శయానరాన పెరియపెరు మాళుడైయ యోగనిద్రాముద్రాను- కారియాక ఇడత్తొడైయిన్‌మేల్ వళర్త్తి, [16]కణ్ణారక్కణ్డు కఴివదోర్ కాదలుఱ్ఱార్‌క్కు ముఱ్ఱూట్టాక క్కాట్టియిట్ట వలత్తిరువడికళుమ్,**

13. **పరబ్రహ్మభూతపరమపురుషవిషయకసంగ కామాత్యుద్దీపకరాన [17]మన్నియశీర్ మాఱనెన్నుమ్ మాఱనుక్కు దేవరీరుడైయ పదసరసి జవ్యాజేన కుసుమశర సహితమాక అమైత్తువైత్త అమ్బురాత్తూణి కళ్‌పోలే ఇణైత్తువైత్త కణైక్కాల్‌కళుమ్.**

14. **కీఴ్‌నోక్కి క్కిళర్‌కిన్ఱ శుడర్‌చ్చోదివెళ్ళ జ్జళ్ ఆసనాభిఘాతత్తాల్ మఱియుణ్డు శుఴిత్తాప్పోలే ఇరణ్డరుకుమ్ తిరణ్డురుణ్డు మడియుణ్డ ముఴన్దాళ్‌కళుమ్**

---

8. తి.వా-3-10-1 9. వేదార్థసంగ్రహం 10. రామానుజాష్టకము
11. సుందరబాహుస్తవం-63 12. శ్రీగుణరత్నకోశం-42 13. శ్రీరంగరాజస్తవం-పూర్వ-88
14. తిరుప్పావై -19 15. మూట్టుకైక్కు -పాఠాంతరము
16. తిరువిరుత్తమ్ -98 17. తి.వా. 7-7-4



9. మా దేశికశిఖామణి స్వామీ! జయ! విజయీభవ!! నేను నీ దాసుడను, నేను నీ దాసుడను.

10. దేవరవారి శ్రీపాదములనెడి తామరలయొక్క భోగ్యతాతిశయమునకు (ఏదో) ఒక ఉపమానముగానున్నది, లోతైన నీటిలో పుట్టినది, దృఢమైన తామరతూడును కల్గినది, సూర్యుని కిరణములచే వికసితమైనది అగు ఒక ఎఱ్ఱ తామర పూవును దాని సమస్త గర్వమును నిరసించుటతోపాటు, దానిని (మీ) శ్రీపాదములక్రింద అణగదొక్కి దాని తలపై విజయపూర్వకముగా కూర్చునియున్న సన్నివేశము యొక్క సొంపును.

11. తామరపుప్పొడికూడ తమ పాదములకు మిక్కిలి బాధాకరమగునట్టి, సఖీజనుల చూపులనుకూడ సహింపనట్టి సౌకుమార్యమును కల్గినవారగు (లక్ష్మీ మొదలగు) దేవేరులు కూడ పాదసంవాహనము చేయుటకు సందేహించునట్టి పుష్పహాస సుకుమారుడైన శ్రీరంగనాథునకును మెత్తని పంచశయనమైన, అత్యంత సుకుమారు లైన దేవరవారికి ఆసనమై, సేవచేయు పుండరీకమునకు తనకు దాస్యముచేయుటకు అర్హమైన సరసత మొదలగువానిని త్రాగించుట కొఱకు (నేర్పుటకొఱకు) దాని ముఖమునందు ప్రవేశింపచేసినట్లు మడచి యుంచిన ఎడమ శ్రీపాదమును,

12. సంసారమను దావాగ్నిచే మిక్కిలి దహింపబడుచున్న సకలలోకము లను రక్షించుట అను భారమునుగూర్చి అనవరతంగాన ఆలోచనలు చుట్టుముట్టుటచే తలకింద పెట్టుకొనబడినది అగుటచే పణిఫతి (ఆదిశేషుడను) శయనముపై పరుండియున్న శ్రీ రంగనాథుని యోగ నిద్రాముద్రను అనుకరించునదియై, ఎడమతొడపై విస్తరించి, కన్నులార దర్శించి, కాలక్షేపమును చేయు అద్వితీయమైన అభినివేశమును కలవారికి (భక్తులకు) పూర్ణభోజనమగునట్లు (తనను) దర్శింపచేయుచు ఉంచిన కుడి శ్రీపాదమును,

13. పరబ్రహ్మయగు పరమపురుషుని విషయకమైన సంగము (కలయిక) నందలి కోఱికను (భక్తిని) మిక్కిలి ఉద్దీపనముచేయువారగు గొప్ప కల్యాణ గుణములను కల శఠకోపులు అనబడు మన్మథునకు, దేవరవారి యొక్క పాదపద్మములనెడి వ్యాజముతో కుసుమ శరసహిత ములుగా అమర్చియుంచిన, అంబులపొదులవలె జంటగా నుంచిన పిక్కలును,

14. అధోముఖముగా వృద్ధిచెందుచున్న కాంతిప్రవాహములు ఆసనము యొక్క అభిఘాతముచే అడ్డగింపబడి, సుడిగా మాఱినట్లు రెండు వైపుల చేర్చబడి నిబిడమై మడచియున్న మోకాళ్లను,

**15.** **[18]శెన్దళిత్త కదళీకాణ్డకరికరభఙ్గళై వెన్రు అడిపెరుత్తు, నునిశిఱుత్తు మదమదెన్రు మాంసలఙ్గళాయ్ విళఙ్గుకిన్ర తిరుత్తొడైకళుమ్,**

**16.** **శఠప్రమథనశమథనసార్వభౌమజైత్రయాత్రారథమ్పోన్ర దేవరీర్ తిరుమేనిక్కు క్కీ ్ళ్ సుఱ్ఱియరుణ్డువరుమ్ ఇరణ్డు చక్రమణ్డలఙ్గళ్పోన్ర పృథునితమ్బబిమ్బఙ్గళుమ్**

**17.** **తిరువరైయిల్ కడితొడఙ్గి క్కణైక్కాల్కళ్ నడువళవుమ్ ఉళ్ళుళ్ళ వడివళకుక్కు అత్యన్తప్రకాశకమాయ్, పొరుత్తముడన్ ధరిత్తిరున్ద కమనీయ కాషాయముమ్,**

**18.** **ఇడవరుకిల్ తొడైయడియిల్ తొఙ్గుకిన్ర తలైప్పుడనే నడుక్కొత్తు, మడిత్తుడుత్త సర్వోత్తరోయోత్తరీయముమ్,**

**19.** **సంధ్యారాగరంజితమాన శారదాభ్రత్తిల్ తనిత్తెళున్దోర్ కొడిమిన్నల్ నిలైనిన్రు పడర్న్దాప్పోల్ [19]అరైచ్చివన్దవాడైయిన్మేల్ నెళిన్దుకొణ్డు నిగనిగెన్ర పొన్నరై నాణ్పూణ్డ అళకుమ్,**

**20.** **భవదనుభవరసవివశరుడైయ అభినివేశపాశపరిభ్రామిత- మతిమంధానమధ్య మానమాన సౌందర్యదుగ్ధసింధువానదు[20] శుగ్ర్రోరుమ్తిరైన్దెళున్ద నడుక్కుళి త్తిట్ట శుళిపోల్ శున్దరమామ్ ఉన్దిమలరుమ్,**

**21.** **వినయముడన్ వీశుకిన్ర వెట్టివేర్ విశిఱికళాల్ అత్యంత ఘుమఘుమిత శనైః శనైః ప్రసరన్మందగంధవహవిహరణవిశేషఙ్గళాలే దేవరీరుడైయ దివ్య లావణ్య తరఙ్గిణీపార్శ్వభాగఙ్గళిల్ ఇరణ్డలైవరిశై పరమ్బినాప్పోల్ ఇరుపక్కముమ్ తికళ్కిన్ర త్రివళికళుమ్,**

**22.** **[21]"మా మేక" మెన్బదై అభినయిత్తు క్కాట్టువదుపోల్ నెఞ్జుక్కు నేరాక క్కొఞ్జమ్ శాయ్త్తు అఞ్జలిత్త తిరుక్కైకళుమ్,**

**23.** **తఙ్గవళైమేల్ తఙ్గిత్తొఙ్గుకిన్ర శఙ్గిలికళోడిణక్కముఱ్ఱ కణైక్కైకళుమ్,**

---

**18. శ్రీరంగరాజస్తవం పూర్వ- 118** **19. అమలనాదిపిరాన్- 2**

**20. సుందరబాహుస్తవం - 57** **21. గీతా - 18-66**



15. అతిశయమును కల్గియున్న (గొప్ప) అరటిబోదెలను , ఏనుగు తొండము లను (అందములో) జయించి, మొదట పృథులములై, చివరగా సన్ననివై, మదమదమని మాంసలములై (లావుగా) వెలుగొందుచున్న ఊరువులును,

16. శఠకోపులనెడి మునిసార్వభౌముల జైత్రయాత్రారథమువంటి దేవరవారి దివ్యదేహమునకు క్రింద పరిభ్రమించుచు వచ్చు రెండు గుండ్రని చక్రములవలె నున్నవి అగు రెండు పృథు నితంబ బింబములును (పెద్ద గుండ్రని పిరుదులును),

17. మధ్యభాగములో కటిప్రదేశముమొదలు ముంగాళ్లమధ్యవరకు లోపలగల దివ్యదేహ సౌందర్యమునకు (పరభాగశోభతో) అత్యంతము ప్రకాశకమై, తగినవిధముగా దాల్చియున్న అందమైన కాషాయమును,

18. ఎడమవైపులో ఊరువుల మూలమున వ్రేలాడుచున్న అంచుతో మధ్యలో మడచి ధరించిన గొప్పదైన ఉత్తరీయమును,

19. సంధ్యారాగరంజితమైన శరత్కాలమేఘములో ప్రత్యేకముగా ఉద్భవించిన ఒకానొక మెఱపుతీగ స్థిరముగానుండి, విస్తరించినట్లు, నడుమున గల ఎఱ్ఱని కాషాయముపై స్థిరముగా చుట్టబడి, నిగనిగమని ప్రకాశించు బంగారుమొలనూలును దాల్చిన అందమును,

20. దేవరవారి అనుభవరసముచే వివశులైనవారియొక్క అభినివేశము అను పాశముచే పరిభ్రమింపచేయబడిన (వారి) బుద్ధి అనెడికవ్వముచే చిలుకబడుచున్న (మీ) సౌందర్యమను పాలసముద్రము క్షుభితమై, తీరములందు ఎగసిన కెఱటములను కల్గినదై, నడుమనగల గోయిలో ఏర్పడిన సుడివలెనున్న అందమైన నాభీపద్మ మును,

21. వినయముగా వీచుచున్న వెట్టివేళ్ల విసనకఱ్ఱలతో మిక్కిలి ఘుమఘుమలాడుచు, మెల్లగా ప్రసరించుచున్న, మందమారుతము యొక్క విహరణవిశేషములచే దేవరవారి దివ్యలావణ్యమను నదియొక్క తీరములలో రెండు కెఱటముల వరుస విస్తరించినట్లున్న, రెండు ప్రక్కలలో ప్రకాశించు త్రివళులును (మూడు మడుపులును),

22. **"మా మేకమ్"** అను (భగవానుని) సూక్తిని అభినయించి చూపునదివలె నున్న హృదయమునకు నేరుగా కొంచెము వంచి, అంజలి చేసిన శ్రీహస్తములును,

23. బంగారు కంకణములపై నిలచి వ్రేలాడుచున్న గొలుసులతో సంబంధమును కల (గొలుసులను తాకుచున్న) మోచేతులును,

**24. అభినవతరదరవికస్వరసరసిజవరముకుళతళత్తళాయమాన నిజాఞ్జలీశిఖాంగుళీశోభైయై నిజహృదయజలజదళైకరసికహార్ద జనార్దనుక్కు అవనమిత్తుక్కాట్టు కైయాల్ ముఱుక్కియిట్ట మున్కైకళుమ్,**

**25. అఘటితఘటనాసమర్థచతుర్భుజభుజదుర్భరవిభూతిద్వయ భరభరణార్థమాక కనకమయగిరివరఙ్గళిరణ్డై వెళిరఱ క్కళ్ళిత్తు పుకరెళ్ళ క్కడైన్దు తూణాక్కి మడుత్తాప్పోల్ ఇరణ్డిడత్తిలుమ్ తిరణ్డురుణ్డు, నీణ్డు, దృఢతరఙ్గళుమాయ్, శిరీషకుసుమ- సౌకుమార్యమ్ తిరణ్డు వడివుకొణ్డాప్పోల్ అత్యంతమృదు-లఙ్గళుమాయ్, [22]సాక్షాత్ భుజగపతి భోగాత్మకత్వప్రత్యాయ- కఙ్గళుమాయ్ విళఙ్గుకిన్ఱ బాహుదణ్డఙ్గళుమ్,**

**26. హృదయాంతర్నిహితబ్రహ్మపురగోపనార్థ మిట్ట హాటకమయ కవాటపుటమ్ పోల్ పళపళెన్ఱు అకన్ఱు గాఢవ్యూఢమాయ్, వయఃపరిమాణ సూచనార్థమాక క్కొఞ్జమ్ తళర్న్దదుపోల్ విళఙ్గుకిన్ఱ విశాలవక్షఃస్థలముమ్,**

**27. అళ్ళకుశెణ్డాడుకిఱ అమ్మార్బినళ్ళకిల్ ఆళ్ళఙ్గాల్పట్టు మయఙ్గి విళ్ళకిన్ఱ మనోనయనయుగళఙ్గళ్ మూన్ఱుక్కుమ్ కైప్పిడికొడుత్తు, ఆవర్గ్రై త్తోళ్ళకిల్ తువక్కుక్కైక్కు త్తొఙ్గవిట్ట అవలంబసూత్ర- త్రయమ్పోన్ఱ సౌదామనీ సవర్ణసౌవర్ణ యజ్ఞసూత్రముమ్,**

**28. సేశ్వరవిభూతిద్వయత్తుక్కుమ్ నిళ్ళల్కొడుత్తు వళర్న్దు, విశాలఙ్గళు మాయ్, గిరివరశిఖరసుఖప్రతిష్ఠితసింహస్కంధసంధిబంధసంస్థాన బద్ధస్పర్ధఙ్గళుమాయ్, శరిన్దుయర్న్దు విళఙ్గుకిన్ఱ తిరుత్తోళ్కళుమ్,**

**29. కంఠరుద్ధప్రణవాక్షరఙ్గళ్ కళ్ళుత్తుళ్ళే నెరుక్కుణ్డు, విమ్మి పుఱమ్ పాశిన్దాప్పోల్ రేఖాత్రయవిభక్తాంగమాయ్, [23]క్రముకతరుణ- గ్రీవాకమ్బుప్రతిమమాయ్ విళఙ్గుకిన్ఱ తిరుక్కళ్ళుత్తినళ్ళకుమ్,**

---

22. రామానుజాష్టపది

23. శ్రీరంగరాజస్తవే పూర్వ-1-4



24. మిక్కిలి నూతనములైన, కొంచెము వికసించిన అందముగా ప్రకాశించు గొప్పపద్మముల యొక్క మొగ్గలవలె తళతళమని ప్రకాశించు తమ అంజలి అగ్రభాగములలోని వేళ్ల శోభను, తమ హృదయపద్మముల దళములలో (నుండుటలో)నే రసికుడైన హార్దజనార్దనునకు వంచి చూపుటకై కొంచెము మడచి యుంచిన ముంజేతులును,

25. అఘటితఘటనాసమర్థుడైన చతుర్భుజుడగు స్వామి భుజములకు కూడ దుర్భరమైన రెండు విభూతుల నిర్వహణ భారమును భరించుటలో సహాయముగా కనకమయము లైన పర్వతములు రెండిటిలోని అసారభాగమును తొలగించి, మెఱయునట్లు చేసి, ముద్దచేసి స్తంభముగా మార్చి, మలచినట్లు రెండు వైపుల చేర్చబడినవై, గుండ్రముగానున్నవై, దీర్ఘములై, దృఢతరములై, శిరీషకుసుమము యొక్క సౌకుమార్యము అంతయు ఒకటిగాచేరి మూర్తీభవించినట్లు మిక్కిలి మృదులములై, సాక్షాత్తు ఆదిశేషుని శరీరముయొక్క రూపమును సూచించునవియై వెలుగుచున్న బాహుదండములును,

26. (తమ) హృదయములోపల నిహితమైన బ్రహ్మపురమును మూయుట కొఱకు నిర్మించిన బంగారుమయమైన కవాటద్వయమువలె పళపళమని ప్రకాశించుచు, విశాలమై, బలిష్ఠమై, వయః పరిపాకమునకు గుర్తుగా కొంచెము కృశించి నట్లుండి వెలుగొందుచున్న విశాలవక్షఃస్థలమును,

27. సౌందర్యము వ్యక్తమగుచున్న ఆవక్షఃస్థలముయొక్క సొబగులో అవగాహించి, మోహమునొందిన మనస్సు, నేత్రములు రెండు- అను ఈ మూడింటి కిని హస్తావలంబనము నిచ్చి, వానిని బాహు సౌందర్యమున ఆసక్తములగునట్లు చేయుటకొఱకు జారవిడువబడిన అవలంబన సూత్రత్రయమువంటి, మెఱపుతో సమానమైన బంగారు యజ్ఞోపవీతమును,

28. భగవానునితోకూడిన ఉభయవిభూతులకును నీడనిచ్చి వృద్ధిచెంది, విశాలములై, గొప్పపర్వతమునందు సుఖముగా స్థిరముగానున్న సింహము యొక్క స్కంధముల సంధిబంధముల ఆకారముతో స్పర్థించునవియై, (కొంచెము వెనుకకు) వంగి ఉన్నతములై ప్రకాశించు బాహువులును,

29. కంఠములో అడ్డగింపబడిన ప్రణవాక్షరములు గొంతులోపలే అదుమబడి, ఉబికి, బయటకు వెలువడినట్లు మూడురేఖలచే విభక్తములైన భాగములను కల్గినదై, క్రముకము(పోక)ల లేలేతతలతో, శంఖములతోపోలినదై వెలుగుచున్న కంఠము యొక్క సొబగును,

30. [24]శుఱ్ఱుమొళివట్టమ్ శూழ்న్దశోది పరన్దదెన్గిఅపడియే శారదశర్వరీ పర్వాగ్ర సమయసమేధితసకలకలాపూర్ణసర్వాహ్లాదకరమాన, మఱుక్కழித్తిన చంద్ర మండలత్తైయుమ్, అప్పోదలర్న్ద శెన్దామరైప్పూవైయుమ్ సహజకాంతిశైత్య మార్దవసౌరభ్యాదికళాల్ అధఃకరిత్తు, కిట్టినారై [25]మైయలేఱ్ఱిమయక్కుమ్ మాయమన్దిరమాయ్ విళఙ్గుకిన్ఱ స్మయమాన ముఖారవిందముమ్,

31. [26]నిన్ఱవానిల్లా నెఞ్జు పిణిప్పుణ్ణుమ్ పడుక్కణ్ణిక్కయిఱ్ఱు చ్చురుళ్కళ్పోల్ శురుణ్డురుణ్డు, నీణ్డు, మనోహరఙ్గళుమాయ్, మున్ శిలనాళ్ శాత్తిక్కళైన్ద ఘనకనకమకరకుండలద్వయత్తై త్తళర్న్దు వళర్న్దు వడువిట్ట వడివழகాల్ కోళ్శొల్లిత్తరక్కడవదు-కళుమాయ్, మార్దవాతిశయత్తాల్ మెల్ల అశైన్దాడు వదుపోల్ తోళళవుమ్ తళతళెన్ఱు తొఙ్గుకిన్ఱ తిరుచ్చెవికళుమ్,

32. ఇశైన్దు కనిన్ద ద్రాక్షాద్వయమ్పోల్, నడుప్పదిన్దు, వకుప్పుణ్డు, తిరణ్డెழுన్ద చుబుకవికాసముమ్,

33. స్వాంతఃస్వాంతన్నిరంతరచింత్యమానానంతశయానంతచిరంతనో దంత సంతానసాక్షాత్కారహఠాత్కారసముదంచితరోమాంచ విశేషఙ్గళాలే పరమ పురుషసంశ్లేషహర్షాతిరేకసూచకఙ్గళుమాయ్, అవ్యక్తాంకురశ్మశ్రు సమూ హతయా[27] "యత్రర్షయః ప్రథమజాః యే పురాణాః" ఎన్గిఱ నిత్యయువత్వత్తై కోళ్శొల్లిత్తరక్కడవదుకళుమాయ్, పుకర్పడైత్తు ప్పెరుత్తు విళఙ్గుకిన్ఱ తాలు మూలఙ్గళుమ్.

34. సకలవిబుధసదాస్వాద్యమాన దేవరీరుడైయ వదనసుధానిధి మండలాంత రాళత్తిల్ తిరట్టియిట్ట అమృతరససారఙ్గళ్పోల్ అత్యంత భోగ్యఙ్గళుమాయ్, చ్చివన్దు కనిన్ద కోవైప్పழத்తైయుమ్ కడైన్దు, తుణ్డిట్ట పవళక్కొడియైయుమ్ [28]హసిత్తు చ్చిఱిప్పదుపోల్ మందస్మిత మనోహరఙ్గళుమాయ్, అతిరుచిరభావగర్భ మాన దొరువార్త్తై శొల్లత్తొడఙ్గి త్తుడిప్పదుపోల్ విళఙ్గుకిన్ఱ తిరుప్పవళఙ్గళుమ్,

35. [29]అభిమతజనదర్శనానందవేగత్తాల్ అర్చావతారసమాధియైక్కడన్దు విమ్మి, వెళివిழுకిన్ఱ అవ్యక్తమధురమందహాసవికాసముమ్[30],

---

24. పెరియాழ்వార్తిరు -1-4-3
25. నాచ్చియార్ తిరు-2-4
26. పెరియతిరుమొழி -1-1-4
27. అచ్ఛిద్రం 28. పరిహసిత్తు - పాఠాంతరము
29. శ్రీరంగరాజస్తవం- పూర్వ-69
30. విలాసముమ్ - పాఠాంతరము



30. చుట్టును జ్యోతిర్వలయముచే విస్తరించినది అన్నట్లు శరత్కాలరాత్రులలో పున్నమినాడు ప్రారంభ సమయమున ఉదయించిన, సకలకళాపూర్ణమైన, సర్వాహ్లాదకరమైన, మచ్చను తొలగించిన చంద్రమండలమును, అపుడే వికసించిన అందమైన ఎఱ్ఱతామరను తన సహజమైన కాంతి, చల్లదనము, మార్దవము, సౌగంధ్యము మొదలగు గుణములచే జయించి, తనను సమీపించిన వారిని పిచ్చి పట్టించి, మోహింపచేయు మాయమన్దిరమై వెలుగొందు చిఱునవ్వు నవ్వుచున్న ముఖారవిందమును,

31. స్థిరముగా నిలువని (చంచలమైన) మనస్సును బంధించు బలమైన ముడులను కల దారముల చుట్టలవలె గుండ్రనివైయుండి, దీర్ఘములై, మనోహర ములై, పూర్వముకొన్ని దినములపాటు ధరించి విడచిన గొప్ప కనక మకరకుండల ద్వయమును కృశించి కొంచెము జారియుండి ఫలించిన తమ అందముతో పూర్వము వానిని ధరించియుండుటను గుర్తులతో నిరూపించునవియై, మార్దవాతి శయముచే మెల్ల మెల్లగా కదలాడునట్లున్న, బాహువులవరకు తళతళమనుచు వ్రేలాడుచున్న కర్ణములును,

32. పరస్పరసదృశమై, పండిన ద్రాక్షద్వయమువలెనుండి, నడుమలో అదుమబడి, విభక్తమై, గాఢమై, కొంచెము ఎత్తుగానున్న చుబుకముయొక్క శోభయు,

33. తమ మనస్సులో నిరంతరము అనుసంధింపబడుచున్న అనంతశయనుడగు అనంతుని ప్రాచీనగాథల పరంపరలయొక్క సాక్షాత్కారముచే హఠాత్తుగా కల్గిన రోమాంచవిశేషములచే పరమపురుషుని సంశ్లేషమువలన జనించిన హర్షాతిరేకము నకు సూచకములై, అస్పష్టముగా అంకురించిన శ్మశ్రుసమూహముచే **"యత్రర్షయః ప్రథమజాః యే పురాణా"** అనెడి నిత్యయౌవనమును సూచింపగల్గినవై, వికాసమునుపొంది, విస్తరించి వెలుగుచున్న తాలుమూలములును.

34. సకలవిబుధులచే (దేవతలచే, పండితులచే) ఎల్లప్పుడు ఆస్వాదింప బడుచున్నదగు దేవరవారి వదనమను సుధానిధి ( చంద్ర) మండలములోపలభాగమున చేర్చి యుంచిన అమృతరససారములవలె మిక్కిలి భోగ్యములై, ఎఱ్ఱని, పండిన దొండపండునుకూడ మించినవై, తుంచిన పగడపుతీగను సైతము పరిహసించి, నవ్వునట్లున్నవై, మందస్మితముతో మనోహరములై, మిక్కిలి రుచిరములైన భావములతో కూడిన ఒక వార్తను చెప్పదొడగి, (అట్లుచెప్పలేక), తడబడునట్లు వెలుగొందుచున్న పెదవులును,

35. అభిమతజన (భక్తజన) దర్శనమువలన కల్గిన ఆనందాతిశయముచే అర్చావతార సమాధిని దాటి, ఉబికి బయల్వెడలుచున్న అవ్యక్తమగు మధురమైన మందహాసము యొక్క వికాసమును,

36. స్ఫటికమయగండశైలకృతఙ్గళాన ఇరణ్డు [31]ముకురమణ్డలఙ్గళై మాశఱక్కడైన్దు, తూళిట్టు, త్తులక్కి, తుడైత్తువైత్తాప్పోల్ తళతళన్ద దివ్యకపోలఙ్గళుమ్,

37. తొఙ్గుకిన్ఱ శెణ్బకప్పూప్పోలే నునిమలర్న్దుయర్న్దు, అడికుఱుకి నీణ్డు, నళికాయుధమ్‌పోల్ రంధ్రద్వయశోభితమాయ్, [32]మాట్టుయర్ కఱ్పకత్తిన్ వల్లియో? కొழுన్దో? ఎన్ను నిత్యసందేహజనకమాయ్ విళఙ్గుకిన్ఱ కోలనీళ్ [33]కొడిమూక్కినழకుమ్,

38. [34]ఎప్పాలుమ్ పరన్దుళ్ల సకలజనఙ్గళుక్కుమ్ తఙ్గళైయే నోక్కినాప్పోల్ అత్యంతరఞ్జకఙ్గళుమాయ్ [35]ప్పుడై పరన్దు, మిళిర్న్దు, ఇలఙ్గొళిశేర్ అరవిన్దమ్ పోల్ నీణ్డు, విశాలఙ్గళుమాయ్, [36]శణ్డైయిడుమ్ ఇరణ్డు కెణ్డైకళ్ పోన్ఱ నెఱ్ఱియழకాల్ విళఙ్గుకిన్ఱ తణ్డామరైక్కణ్గళుమ్,

39. గుణారోపణమ్‌కొణ్డు వళైన్దు నిన్ఱ శార్‌ఙ్గవిల్లై నిజమాన వడివழகాల్ వెన్ఱుకొణ్డు వళైన్దునిన్ఱ తిరుప్పురువవట్టఙ్గళుమ్,

40. [37]శారదాష్టమ్యోషధీశనుడైయ అతినిర్మలమండలాంతరాళత్తిల్ ఊఱ్ఱు మాఱా మల్ శురన్దు, పెరుకివరుకిన్ఱ [38]ఇరణ్డుఅమృతధారైకళ్ తదుపాంతవినిర్మిత దివ్యాలవాలకుల్యాకూలబంధవిశేషఙ్గళాలే పరస్పరమెదిర్‌కొణ్డు, మఱియుణ్డు, కూడిక్కుఱుకి, గంభీరమాయ్ వழிన్దిழిన్దు వళర్న్దు పడర్న్దదోర్ కఱ్పక క్కొడియిన్ అడియిల్ ఏఱి ప్పాయ్న్దు, నిఱైన్దు తేఙ్గినిన్ఱాప్పోల్ తిరునెఱ్ఱియిన్ నడువిల్ వడువిట్టు పడిన్దుకొణ్డు, అవిచ్ఛిన్నరేఖముమాయ్, భ్రూపక్ష్మ యుగళాంతరాళస్థిత కోణద్వయ శోభితముమాయ్, విచ్ఛిన్న మూలము మాయ్, [39]కోలనీళ్‌కొడిమూక్కినడియై విళాక్కొలైక్కొణ్డు విళఙ్గుకిన్ఱ రామానుజాఖ్యదివ్యపీఠసంయుతమాన దివ్యోర్ధ్వపుండ్రవిశేషముమ్,

41. అదినిడైయిల్ అమృతోద్భవైయాన సకలవిభూతిపట్టాభిషేకసామ్రాజ్య లక్ష్మియినుడైయ స్వేచ్ఛావిహారవిక్షిప్తపదకమలలాక్షారసధారారేఖైపోల్ చ్చివన్దు, పడిన్దు విళఙ్గుకిన్ఱ రక్తవర్ణశ్రీచూర్ణరేఖైయుమ్,

31. రామానుజాష్టపది
32. తి.వా. 7-7-2
33. తి.వా. 5-5-6
34. ఎప్పోదుమ్ - పాఠాంతరము
35. అమలనాదిపిరాన్-8
36. శ్రీరంగరాజస్తవం పూర్వ - 99
37. సుందరబాహుస్తవం -41
38. రామానుజాష్టపది
39. తి. వా. 5-5-6



36. స్ఫటికమయములైన శిలాఖండములచే చేయబడిన రెండు ముకుర (అద్దము) మండలములను కళంకము లేనట్లు శోధించి, చూర్ణముతో తోమి, శుభ్రపరచి, తుడచినట్లు తళతళమని ప్రకాశించు దివ్యకపోలములును,

37. కిందకు వేలాడు చంపకకుసుమమువలె అగ్రమున వికసించి, ఉన్నతమై, మూలమున సన్ననిదై, ఋజువై, నళికాయుధమువలె రంధ్రద్వయ శోభితమై, కల్పవృక్షముయొక్క లతయా? చిగురా? అనెడి నిత్యసందేహమును కల్గించు నదియై, వెలుగుచున్న, అందమైన, దీర్ఘమైన లతవంటి నాసికయొక్క సౌందర్యమును,

38. అంతట సమూహములుగా నిండియున్న సకలజనములకును తమనే కటాక్షించు నట్లు తోచుచు, అత్యంతము సంతోషజనకములై, విస్తరించి, మెఱసి, ప్రకాశించు కాంతిని కల అరవిందమువలె దీర్ఘములై, విశాలములై, పరస్పరము స్పర్ధించు రెండు సొఱచేపలవలెనున్న, అందముచే వెలుగొందుచున్న చల్లని తామర నేత్రములును,

39. అల్లెతాడు ఎక్కుపెట్టబడిన, విస్తరించియున్న శార్‌ఙ్గమను వింటిని తమ రూప సౌందర్యముతో జయించి, వంగియున్న అందమైన కనుబొమలును.

40. శరత్కాలములోని అష్టమీతిథియందలి చంద్రునియొక్క అతి నిర్మలమైన మండలములోపల ఊట మాఱకుండ ఎల్లప్పుడు బహిర్గతమై ప్రవహించు రెండు అమృత ధారలు తమ సమీపమున నిర్మింపబడిన దివ్యములైన పాదులలోని కాలువల అంచులలోగల బంధవిశేషములచే విడివడి, పరస్పరము అభిముఖములై ప్రవహించి, దగ్గఱకు చేరి కలసి, సాంద్రములై నిలచి, వృద్ధిచెంది, విస్తరించిన ఒక కల్పకలత యొక్క మూలమును చేరి, ప్రవహించి, పూర్ణమై తేటపడియున్నట్లు నుదుటిమధ్యలో రూపునొందియుండి, అవిచ్ఛిన్నరేఖమై, కనుబొమలు, కంటి రెప్పలు అను రెండిటియొక్క మధ్యలోగల కోణద్వయముచే శోభిల్లునవియై, విచ్ఛిన్నమూలమునై, అందమైన లతవంటి నాసికయొక్క మూలమును పూర్ణముగా ఆవరించి వెలుగుచున్న, రామానుజమను దివ్యపీఠముతో కూడిన దివ్యోర్ధ్వపుండ్ర విశేషమును,

41. దానిమధ్యలో అమృతమునుండి ఉద్భవించిన, సకలవిభూతిపట్టాభిషేక సామ్రాజ్య లక్ష్మియొక్క స్వేచ్ఛావిహారములందు మోపబడిన పద కమలములందలి లత్తుకరసముయొక్క ధారల రేఖవలె ఎఱ్ఱగా ముద్రితమై, వెలుగుచున్న రక్తవర్ణమైన శ్రీచూర్ణరేఖయును,

**42.** [40]మలర్న్దుయర్న్ద తిరుముడియుమ్,

**43.** వళర్న్దు మడిన్దు వ్యక్తావ్యక్తమాయ్ విళఙ్గుకిన్ఱ తిరుక్కుழ లొழுఙ్గుమ్,

**44.** శుఱ్ఱిచ్చుழత్తి క్కళైత్తిట్టు ముడిత్తు త్తొఙ్గవిట్ట శిఖాబంధముమ్,

**45.** పిన్నెడుత్త పిడరియழகుమ్,

**46.** తిరువనన్దాழ்వాన్ పిన్పడమ్పోలే నడుప్పదిత్తు, పరన్దు నెఱిత్తిట్ట తిరుముదుకుమ్,

**47.** వలవరుకిల్ కైమేలుమ్, మార్బిలుమాయ్ మున్నాట్టి త్తాఙ్గియిట్ట త్రిదండాగ్రముమ్,

**48.** శిరియదోర్ నిధిపోల్ తిరుమున్బే నోక్కి వైత్తిట్టువైత్త తిరువడినిలైకళుమాయ్ ఇప్పోదు దేవరీర్ తిరుమఞ్జనమ్ కొణ్డరుళ ఎழுన్దరుళి యిరుక్కుమழகు ఈదేనుమ్ శిన్దైమరుళో ?

**49.** జగన్మోహనమంత్రప్రభావమో ?

**50.** సకలరసగుళికావిశేషమో ?

**51.** సర్వభోగచింతామణిప్రకాశమో ?

**52.** [41]అఖిలజగత్సుకృతవిపాకమో ?

**53.** అఖిలఫలకల్పలతా ప్రసవమో ?

**54.** సమస్త సంపత్ సామ్రాజ్యవేషమో ?

**55.** [42]సర్వమంగళసంతానప్రసవమో ?

**56.** [43]సకలజగజ్జీవన మూలమో ?

**57.** సర్వానందకందావతారమో ?

**58.** సకలకలారహస్యసర్వస్వమో ?

**59.** సర్వేశ్వరాపద్ధనమో ?

---

**40.** ఉయర్న్దు మలర్న్ద - పాఠాంతరము. **41.** అఖిలజనసుకృత - పాఠాంతరము

**42.** అఖిలజగజ్జీవన-పాఠాంతరము **43.** అతులానంద-పాఠాంతరము

**44.** కొణ్డరుళకవే-పాఠాంతరము



42. వికసించిన (విశాలమైన), ఉన్నతమైన శిరస్సును,

43. పెరిగి, ముడువబడినవై, అస్ఫుటముగా ప్రకాశించుచున్న కేశపాశముయొక్క తీరు,

44. గుండ్రముగా చుట్టి ముడివైచి, వ్రేలాడదీసిన శిఖాబంధమును,

45. (కొద్దిగ) వెనుకకు వంగిన కంఠము వెనుక భాగము యొక్క అందమును,

46. అదిశేషుని పడగ వెనుకభాగమువలె మధ్యలో విస్తరించి, వర్తులమైన నడుమును,

47. కుడివైపున హస్తమునకుపైన, వక్షఃస్థలమున నిలుపబడి, యజ్ఞోపవీతమును తాకునట్లుంచిన త్రిదండాగ్రమును

48. గొప్ప అద్వితీయమైన నిధివలె ముందుంచబడిన శ్రీపాదుకలును - అను ఈరీతిలో ఇపుడు దేవరవారు అభిషేమును స్వీకరింప గోరి వేంచేసియున్న ఈ సన్నివేశముయొక్క ఈ సొబగు ఏదైన చిత్తభ్రమయా ?

49. జగన్మోహనమంత్రమ యొక్క ప్రభావమా ?

50. సకలరసములను కల గొప్ప గుళికయా?

51. సర్వభోగములను ఇచ్చు చింతామణి యొక్క ప్రకాశమా ?

52. అఖిలజగత్తు చేసికొన్న పుణ్యముయొక్క పుణ్యఫలమా ?

53. అఖిలఫలముల నిచ్చు కల్పలతయొక్క ప్రసవమా? (చిగురా?)

54. సమస్త సంపత్ సామ్రాజ్యము యొక్క రూపమా?

55. సర్వమంగళముల సమూహము యొక్క సంతానప్రసవమా ?

56. సకలజగత్తుల జీవనమునకు మూలమా ?

57. సర్వానందముల మూలముయొక్క అవతారమా ?

58. సకల కళల రహస్యములయొక్క సర్వస్వమా ?

59. సర్వేశ్వరుని ఆపద్ధనమా ?

**60. ఇవైయెల్లామ్ తిరణ్డొళ్ళున్దు కొణ్డదోర్ వడివో ?**

**61. ఇదువుమన్ఱి, అప్రమేయతేజస్సో ?**

**నాఙ్గళ్ ఏదొన్ఱఱియో, ఇవ్వళకుడన్ దేవరీర్ ఊళిదోఱుమ్ ఊళిదోరుమ్**

**వాళ్న్దిడుక ! వాళ్న్దిడుకవే !**

**యతిసార్వభౌమనే ! తిరుమఞ్జనమ్ [44]కణ్డరుళకవే !**

**జయ ! విజయీభవ !**



---

60. ఇవి అన్నియును కలసి మూర్తీభవించిన ఒక అద్వితీయమైన రూపమా ?

61. ఇవి ఏమియు కాక ఒక అప్రమేయమైన తేజస్సా ?

మేము ఇతమిత్థముగా దేనిని తెలియలేము. ఈ అందముతో

దేవరవారు కల్పముల తరబడి, కల్పముల తరబడి వర్ధిల్లుడు ! వర్ధిల్లుడు !

యతిసార్వభౌమా ! తిరుమఞ్జనమును స్వీకరింపుడు !

జయ ! విజయీభవ !!



## సంకేత సూచి

తి.వా. - తిరువాయ్‌మొళి ఇ.రా - ఇరామానుశనూఱ్ఱన్దాది

ఉప. ర - ఉపదేశరత్నమాలై

'ళ', 'ఱ్ఱ' 'ఱ' అను అక్షరములను 'ళ' గా, 'ట్ర' గా, '఼అ'గా చదువుకొనవచ్చును.